Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] 1942 వ సం॥ ఏప్రిల్ నెల 10 వ తేది శుక్రవారం [నె 14 రు.

## యుద్ధ విమర్శ—విశేషాలు.

**బర్మా పరిస్థితులు.**

దక్షిణ బర్మాలో జపానువారు చొచ్చుకపో గల్గుచున్నారు, కాని వారు విశేషంగా నష్టపోయి ఎంతో కష్టంపై ఆపని చేయగల్గుచున్నారు. శత్రువును దక్షిణ భాగంలో ఎంతవరకు పోగలడో అంతవరకు పోనిచ్చి ఉత్తరానికి రాకుండా చేయుటే మిత్రమండలిసైన్యంయొక్క యుద్దేశం. ఆకార్యం చాలవరకు నెరవేరింది, రక్షణకు ఎక్కువ అనుకూలంగానుండుచోట్ల సైన్యం ఉంచు టవసరమగుటచేతను, శత్రువిమానశక్తి మన శక్తికన్న అధికంగా నుండుటచేతను యిటీవల మన సేనలు వెనుకకు రావలసివచ్చెను, బర్మాలో మన విమానాశ్రయాలు పెక్కు చెడుటచేత జపాను విమానదాడుల నెదుర్కొనుట మరింత కష్టమైనది. బర్మాకు ఆయుధసామగ్రి పంపుటకు రోడ్డు సౌకర్యాలు ఎక్కువగువరకును, విమానశక్తి అధికమగువరకును యుద్ధం ఎట్లో కొనసాగించుచుండుటే మన కర్తవ్యం. అంతవరకు మరికొన్ని తీవ్రసంఘటనలు కలుగవచ్చును.

“ఇప్పటికి శత్రువుదే పైచేయిగావుంది. సైన్యాన్ని భద్రంగానుంచుటకు ఒకప్పుడు ‘వెనక్కుపోతూవుండాలి. బర్మాలో మన సైన్యాలు యింకా కట్టుదిట్టములు కలిగియున్నవి. చాల కష్టాలకోర్చి యుద్ధంచేయుచున్నవి.” విమానయుద్ధాలలో బ్రిటిషువారి నష్టం శత్రువుతోపోల్చిచూచిన చాల తక్కువ. త్వరలో నష్టం భర్తీచేసిన పిదప తిరిగి సైనికులును వారి సహాయకులును బాగుగ పోరగలరు. అపుడు యుద్ధగతి మరలిపోవును.

**యుక్తిలో మించుట.**

బర్మాలో రెండు యుద్ధరంగాలున్నాయి. ఒకటి ఇరావతి లోయయందు బ్రిటిషువారే అధికారం కలిగియున్నారు. రెండోది మాండలే-రంగూను రోడ్డునందు చీనా సైనికులు అధికారం కలిగియున్నారు. ఇంకో యుద్ధరంగం సయాం-బర్మా సరిహద్దులలో, అచట రెండు చీనా సైనిక దళములు షాను సంస్థానములనుండి సయాం వాయువ్యదిక్కునకు పోయి దాడిచేసినవి. జపాను సైనికులు క్రొత్తగ దిట్టం చేయబడిన మిత్రమండలి శిబిరాల చేరుసరికి తీవ్రంగా నిరోధింపబడుచున్నారు. ఇచట యిపుడు జరుగుచున్న యుద్ధానికి రంగూనులో మొదట జరిగిన యుద్ధాలకు వ్యత్యాసంగలదు. అపుడు మిత్రమండలి వారు ప్రక్కనున్న దీర్ఘమగు మార్గములను కాపాడుచుండిరి. జనరలు వావెలుగారు చెప్పినట్లు యీ రక్షణ చాలకష్టం. ఎక్కడో ఒక చోట మార్గం చెడి శత్రువు త్రోసుకవస్తే మనసేన వెనక్కి పోకతప్పని సరికావచ్చును. ఇపుడు అట్లుకాదు. రాధారి మార్గాలు సైన్యానికి వెనుక వైపునగలవు. ఇపుడు వాటి నిడుపుతప్ప మార్గరక్షణకు యింకేవిధమగు అసౌకర్యముండదు. రక్షణవిధానమునందు యీమాత్రం సౌకర్యం చేకూరినంతమాత్రమున బర్మాకు ప్రమాదం తప్పిపోయిందనుకోరాదు. ఇంకా కొన్ని చిక్కులుగలవు. మన రాధారి మార్గాలు యుద్ధరంగంతో సరిగా నిడుపునాలేక అడ్డంగా, ఎదురుగనున్నవి. పైగా అవి నిజంగా సరకు ఏదేశం నుండి వస్తున్నదో ఆ ఇండియాకు సరిగా కలిసి

లేవు. ఉత్తరబర్మాకు అస్సాంకుమధ్య అడవి కొండల ప్రదేశం కొంత కలదు. అందుండి కొద్ది కాలిబాటలేగాని రోడ్లు లేవు. వీలయినంత త్వరగా యీ బాటలు అభివృద్ధి చేయబడుచున్నవి, కాని యిదివరకు సముద్రమార్గంలో రంగూనుకు పంపినంత వడిగా సైన్య సహాయం పంపుటకు వీలులేదు. కాని యిదివరకుకన్న యిపుడు మిత్ర మండలికి ఎక్కువసేనలు కలవు. అందుచే జపాను వారేమేనా చొరవచేసుకుంటే బాగా దెబ్బ తింటారు.

బర్మాలో జపానువారు విజయం పొందుటకు కారణాలు తెలుసుకొనుట కష్టంకాదు. వారికి పాడుచేసుకొనుటకు విశేషంగా అంగబలం గలదు. రెండవది బర్మాకు పోవు మార్గంలో వారికి క్రొత్త మిత్రులు తాయిలాండు దేశీయులు చేకూరిరి. మూడవది బర్మాలోనే తకినులనువారు, డబ్బుకి ఆశపడి దేశద్రోహు లయి మన సేనల ఉనికిని జపానువారికి తెలియ జేసి మోసం చేయుచున్నారు. వారు జపాను సేనలకు ధాన్యం, పశువులను యిచ్చి తోడ్పడు చున్నారు. ఇంత చేసినా వారిని జపానువారు గౌరవించుటలేదు. చివర కారణం విమానాధి క్యత వారికి గలదు. మన విమానాలు జపాను విమానాలకన్న ఘట్టివే అయినా, వారి విమానా లలో మూడో వంతేయున్న మనవిమానాలు ఒకే సారి అన్నిచోట్లకు పోజాలవు.

బర్మాలో జపాను సేనలు.

ఎదురుపడి ముష్టియుద్ధం చేయవలసివస్తే మన సైనికులకు జపాను సైనికులు సరికారు. ఘూర్కా సైనికులు తుపాకులకు తగిలించిన సున్నీలతో దగ్గరపడి ఎదురుకొన్నపుడు జపాను సైనికుడు భీతిచెంది నిలువలేడు. ధైర్యం లేక కాదు. గాయపడినా జపాను సైనికుడు నుదురు చూపి అక్కడ గుండు ప్రేల్చమని శత్రువును అడుగుచుండును. కాన వారికి ధైర్యం చాలక కాదు. కేవలం మన ఘూర్కాల సున్నీలు కత్తులనుండి తప్పించుకోలేక పారిపోతూంటారు.

జర్మనులవలెనే జపాను సైనికులు గూడ అనేక మోసం ఎత్తులు వేస్తూవుంటారు. ఒకటి రెండు వచ్చీరాని ఇంగ్లీషు మాటలాడి, మన సైని కులు జబాబుగ కేకలు వేస్తే వారెక్కడ నున్నారో తెలిసికొంటూవుంటారు. పటాసుకాయలు, గాలి పిస్తోళ్లు ప్రేల్చి మనవారు తుపాకులు కాల్చునట్లు చేసి ఎక్కడున్నది తెలుసుకొంటూ వుంటారు. అంతేకాక ఎక్కువ మందుగుండు ఉన్నట్లు డాబు చేయడానికి పటాసుకాయలు ప్రేలుస్తూవుంటారు. చెట్లకొమ్మలపై మర ఫిరంగులుంచుతూ వుంటా రు. తమ విమానాలకు బ్రిటిషు విమానల గుర్తులు వేయుట, ఘూర్కా టోపీలు తాము ధరిం చుట మున్నగు మోసపు చేష్టలు జపాను సైని కులు చేస్తూవుంటారు.

బర్మాలో సైన్యం వెంటనున్న భారతీయ విలేఖరి యొకడు ఒక భారతీయ సైనికుల బెటా లియను చేసిన ఘన కార్యమును యిట్లు వర్ణిం చెను. ఈ సైనికదళం పియుంటజా నగర మును, తీవ్రమగు వీధి యుద్ధంలో గెలిచి పట్టు కొని శత్రువును కడుదూరం తరిమివేసెను. కాని శత్రువునకు క్రొత్త సైన్యం సహాయం వచ్చు టచే వెనుకకు రావలసివచ్చెను. ఈ బెటాలి యనులో చేరిన మూడు కంపెనీల సైనికులు మూడు వైపులనుండి పంపబడిరి. ఒకటి పడ మర నుండి, ఒకటి తూర్పునుండి, మూడవది పియుంటజానుండి శత్రువు పారిపోకుండ అడ్డుట కు పంపబడెను. ఈ మూడు కంపెనీల సైని కులు చీకటిలో రాత్రంతా ప్రయాణంచేసి ప్రాతః కాలమున దాడి ప్రారంభించి త్వరలో ఆ నగర మును వశపరచుకొనిరి.

జపానువారు రోడ్డుమీదుగా మోటారు లారీ లలో క్రొత్త సైన్యాలను టాంకుల సహాయంతో గూడా తెచ్చి తిరిగి దాడి ప్రారంభించిరి. ముం దున్న కంపెనీ సైన్యం తీవ్రమగు శత్రుదాడికి గురియయ్యెను. సైనికులు అతి పట్టుదలతో ధైర్యంగా పోరినప్పటికి శత్రువుల సంఖ్య అధిక మయినందున ముందుకు పోజాలక పోయిరి. మిగతా మూడు కంపెనీలు గూడ విరమింపవలసి వచ్చెను. ఆపని జయప్రదంగా జరిపిరి. కొన్ని వందల శత్రువులను చంపగల్గిరి.

ఒకసారి భారతీయ సిపాయిలు జపాను సైని కులు విశ్రాంతి గైకొనుచుండగ జొరబడి కొట్టిరి. ఇంకో కంపెనీకి ఆ అదృష్టం లేకుండెను. శత్రు వర్గంలో చేరిన బర్మనులు యీ కంపెనీ సైనికు లున్నచోటు గుర్తించి జపానీయులకు చెప్పేసిరి. మొదట సహాయపడిన ఫిరంగి దళాలుగూడ దృష్టి ఆననందున మనవారికి సహాయం చేయ లేక పోయినవి.

అమెరికా యుద్ధ సామగ్రి ఉత్పత్తి శాఖాధికారియగు డోనాల్డు నెల్సను గారు, అమెరికా ఉత్పత్తి వివరములు గూర్చి గత శనివారం ఉపన్యశించుచు, గత యిరవైయవ నెలలలో యిదివరకెన్నడు లేనంత ఎక్కువగ ఉత్పత్తిచేసినదనిరి. అధ్యక్షుడు రూజువెల్టుగారు విమానాల సృష్టికి విధించిన కాలనిర్ణయం సరిగా అనుసరించబడెను. టాంకుల ఉత్పత్తి ముందే జరిగెను. వర్తకనౌకలు, విమాన విధ్వంసక ఫిరంగులు, టాంకులను చేదించే ఫిరంగులను యీ యేడు అనుకున్న ప్రకారం సృష్టించెదరు. కార్మికులును కంపెనీల యజమానులును మంచి సహకారముతో పనిచేయుచున్నారు.

ఇంగ్లాండు-అమెరికా ఆయుధోత్పత్తి

అమెరికాలో జెయిళ్లన్నియు యుద్ధసామగ్రి ఉత్పత్తి కేంద్రాలుగ మార్చబడుచున్నవి. ఖైదీలచే పనిచేయించుచున్నారు. జార్జియా రాష్ట్రంలో అటలాంటా జెయిలునందు సైన్యానికి కావలసిన దుస్తులు తయారు చేయుచున్నారు. పెన్సిలువీనియాలో ఒక జెయిలునందు బాంబులకు కావలసిన డబ్బాకప్పులు తయారు చేయుచున్నారు. రైల్వే పెట్టెలు, ఇంజనులు, మోటారుకారుల పరిశ్రమ అన్ని అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం వశపరచుకొంది.

అమెరికా తన దేశరక్షణకు కావలసిన సరకు తయారు చేసుకోవాలి; దీనితో బాటు యితర మిత్రదేశాలకు కావలసినవి తయారు చేయాలి. అదిన్నూ అతివడిగా తయారు చేయాలి. ఆ దేశాలు యుద్ధం జయప్రదంగా కొనసాగించుటకు అమెరికా ఆయుధోత్పత్తి పైనే ఆధారపడియున్నవి. ఈ రెండు బాధ్యతలుండుటచేత అమెరికా ప్రభుత్వం నిరుడు నవంబరు మాసమునందే 7,10,000 లక్షలడాలరుల వ్యయముచేయ నిశ్చయించెను. ఈ ఖర్చు యిపుడు రెండింతలుగా పెంచవలసివచ్చును. ఎన్ని డాలరులేనా ఖర్చు నిశ్చయించవచ్చును. కాని టాంకులు ఫిరంగులు నౌకలను కాగితం డాలరులతో ఎదిరించుటకు వీలులేదు. కనుక వాటి నెదుర్కొనుటకు టాంకులు, ఫిరంగులు సబుమెరైనులు నిర్మించవలసియుండును.

యుద్ధంలేని కాలంలోనే అమెరికా సంయుక్త రాష్ట్రముల పరిశ్రమలనుండి ప్రపంచానికంతకు కావలసిన చిన్న షికారు మోటారుకారులలో నూటికి 70 వంతు తయారగుచుండేవి; టెలిఫోనులు 50 వంతు, రేడియోలు 45 వంతు. ఇపుడు సరిగా ఎన్ని తయారవుతున్నాయో ఫుల్లరు గారి సంఖ్యలు తెలుపలేదుకాని, ఏరీతిగా ఎక్కువైందో తెలిపిరి. డిశంబరు 7 వ తేదిన జపాను యుద్ధం ప్రారంభించేసరికి అమెరికా నుండి ఆయుధాల ఎగుమతి అప్పడే ప్రారంభమగు చుండెను. అప్పటికే పరిశ్రమలలో ఉత్పత్తి నూటికి 30 వంతు పెరిగెను. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి నూటికి 14 వంతు హెచ్చింది. ఇది కర్మాగారాలు నడుపుటకు చాల అవసరం.

ఒక ఏడాదిలో యంత్రాల కవసరమగు పనిముట్లు ఉత్పత్తి 4,500 లక్షల డాలరులనుండి 7,500 లక్షల డాలరుల వరకు పెరిగింది. అనగా ఫిరంగులు, విమానాలు, టాంకులు తయారు చేయుటకు ఉపయోగించు లోహం అనువగు రూపంలోకి తెచ్చుటకు, కోయుటకు, పదును చేయుటకు అవసరమగు పనిముట్లు తయారుచేయుట ఏడాదిలో ⅔ వంతు పెరిగిందన్నమాట.

ఉక్కు ఉత్పత్తి సాలీనా 20 లక్షల టన్నులు, వచ్చేయేడు 950 లక్షలకు పెరుగునని అంచనా వేయుచున్నారు. చమురు ఉత్పత్తి 12,000 లక్షల బారల్సు. ఈ యేడు 14,000 లక్షల బారల్సుకి పెరిగింది. మెగ్నిషియం ఉత్పత్తి 300 లక్షల పౌనులనుండి 660 లక్షల పౌనులకు పెరిగింది. పొగలేని యంత్రశక్తి 930 లక్షల పౌనులనుండి 3,740 లక్షల పౌనులకి పెరిగింది. ఇవన్నిగూడ ఆయుధాలు మందుగుండు తయారు చేయుటకు అత్యవసరము.

రోజుకు రెండు నౌకల సృష్టి.

నిరుడు డిశంబరులో అమెరికా ఇంగ్లాండునకు 500 విమానాలు పంపుచుండేది. ఈ యేడు నెలకు 650 చొప్పున పంపగలదు. నిరుడు నవంబరులో దినానికొక యుద్ధనౌక క్రొత్తది నీటది గేది. ఈ యేడు దినానికి రెండు చొప్పున తయారుచేయగలదు. వర్తక నౌకలు నెలకు 84,000 టన్నుల చొప్పున తయారగుచున్నవి. వచ్చే యేడు 230,000 టన్నులు నెలకు తయారు కాగలవు.

1941 వ సం॥ సెప్టంబరులో 1,900 యుద్ధ విమానాలు తయారయినవి. 1,040 కన్న యిద్ది

రెండింతలు ఎక్కువ. వచ్చే ఏటినుండి సాలీనా 50,000 విమానాలు సృష్టింపబడును.

నిరుడు టాంకులు 5,000 ఉత్పత్తి చేయబడినవి. 1940 వ సంగుపు సంఖ్యకన్న యిది పది రెట్లు ఎక్కువ. ఈ ఏడాది 26,000 టాంకులు నిర్మింప నిశ్చయించబడెను.

"ఒక యుద్ధనౌక మునుగుతే అమెరికనులు దాని స్థానే రెండు నిర్మిస్తారు. ఒక బాంబుపోతే 12 బాంబులు తయారు చేస్తారు. విమానాలు పడిపోతే ఆకాశమంతా నిండు నన్ని విమానాలు తయారు చేస్తారు. దేశీయులందరి సహాయంతో అమెరికా పరిశ్రామికులు చాల అభివృద్ధిచేయుచున్నారు. చివరవరకు తయారుచేస్తూనేవుంటారు. చివరకు విజయం చేకూరేవరకు ఉత్పత్తి చేస్తూనేవుంటారు. ప్రపంచంలో స్వాతంత్ర్యం నశించిపోకుండాను మానవకళ్యాణం చేకూరువరకును సౌమనస్యం పెంపొందుటకును అమెరికనులు తయారుచేస్తూనే వుంటారు."

ఆండమానులపై అమెరికా విమానాల దాడి.

అమెరికను ఫోర్ట్రెసు విమానాలు ఇండియా దేశంలోనున్నవి. పోయి అండమాను దీవులందున్న పోర్టుబ్లేరు నగరంపై బాంబులు వేసినవి. ముందేమి జరుగనున్నదో దీనివల్ల సూచింపబడుచున్నది. ఇండియా ఒంటరిగ యీ యుద్ధం చేయనవసరం లేదని దీనివలన ధైర్యంగా నుండవచ్చును. అండమాన్సు దీవులను ఆక్రమించుటవలన లాభాలతోపాటు నష్టాలుకూడ కలవని జపానువారు గుర్తించగలరు. వారు ఇండియాపై దాడి జరుపుటకన్న వారిపై ఇండియానుండి దాడిచేయుట సులభంగానుండును. పోర్టుబ్లేరు రంగూనునుండి 400 మైళ్లె, కాని ఇండియాలో అతిచేరువైన రేవు స్థలం 750 మైళ్ళ దూరంవుంది.

అమెరికానుండివచ్చిన ఫ్లైయింగు ఫోర్ట్రెసు విమానాలు అమెరికానుండి పడమటి ఇండీసు దీవులు, ఆఫ్రికాఖండం మీదుగ ఎగురుచు వచ్చియుండును. ఇపుడు అమెరికానుండి సప్లైయిలు అట్లాంటికు సముద్రందాటి ఆఫ్రికాకొననున్న కేపు అఫ్ గుడు హోపు రేవుమీదుగాగాని, అట్లాంటికు సముద్రందాటి, ఆఫ్రికాఖండంలో నేలపై దాటి తరువాత అరేబియను సముద్రందాటి, కొంత సముద్రం పైని కొంత నేలపైని ప్రయాణం చేసిగాని రావచ్చును.

---

# హిట్లరుకు పెట్రోలు దాహం.

హిట్లరు రథం మళ్లీ బయలుదేరుచున్నదని వార్తలు వస్తున్నాయి. "వెడాలె వేటతమకమున వెడాలె-డాలుకత్తులు మెరయగ" అన్నట్లుగా, "చూస్కో నా శౌర్యం" అంటూ 40 లక్షల సేనతో మాస్కోమీదకు మళ్లీ బయలుదేరివస్తున్నాడట. కాని లెనిన్‌గ్రాడు రంగంలో 3,400 జర్మను సైనికులు మొన్ననే హతమైనారు. కాలినిన్‌వద్ద 1,630 మంది జర్మను సైనికాధికారులున్నూ, బ్రియాంస్కువద్ద 100 మంది జర్మను సైనికాధికారులున్నూ రష్యనులచేతులలో పరాజితులైనారు. జర్మను సేనలు రెండు మూడు రోజులనుంచీ బాగా విజృంభించి రష్యనుసేనల మీదకు దండెత్తుచున్నవి. ప్రతాపం చూపించినందుకు పరితాపం పొందుతున్నవి. శ్రీరామలోనే హంసపాద అన్నట్లయింది. విజృంభించాడో లేదో జర్మను పటాలాలు మొన్ననే మూడుచోట్ల ముక్కచెక్కలైనాయి. రమారమి వంద జర్మను టాంకులు ధ్వంసమైనాయి హిట్లరు కేవలం రక్తదాహంతోఉన్నాడు. రష్యనుల ఎర్రసేనను చీల్చి చెండాడుతానని హుంకరిస్తున్నాడు. ఈ వసంత ఋతువు యుద్ధంలో తన ప్రతిజ్ఞ సాధిస్తానన్నాడు. ఈదెబ్బతో తాను జయించుటమో, రష్యా జయించడమో, అటో ఇటో తేలవలెనన్నాడు. రష్యాలో మంచుగడ్డలు కరిగితేనేగాని తన సైన్యప్రవాహం ముందుకు సాగదన్నాడు. రమారమి 40 లక్షల జర్మనుసేనను తయారుచేశాడని వార్తలు వచ్చాయి. కాని, ఎన్ని ప్రవాహములైనా సముద్రంలోకలిసి "నదీనాం సాగరోగతిః" అన్నట్లుగా సముద్రంలోపడి గతించవలసినవే. జర్మను సైన్యం మహాప్రవాహంలాగున వస్తే, రష్యను

# చర్చిల్ కుమార్తె.



బ్రిటిషు ప్రధానమంత్రి చర్చిల్‌గారి ఆఖరు కుమార్తె మేరీ 18 సం॥ల కన్య యుద్ధ సేవకరాలుగా ఆగ్జలియరీ టెరిటోరియలు సర్వీసునందు చేరెను. ఆమె మిలిటరీ దుస్తులతో యిచట అగుపడుచున్నది. విమాన విధ్వంసక చర్యలందు శిక్షణపొందుచున్నది. ఇట్టి పనులందు ఎందరో వేలకొలది బ్రిటిషు స్త్రీలు చేరియున్నారు.

---

సైన్యం సముద్రములాగున పొంగుతూవున్నది. ఆ జర్మను సైన్యప్రవాహం యీ రష్యను సముద్రగర్భంలో పడకతప్పదు. దానిని రష్యా కబళించి తనకడుపున పెట్టుకొనుటకు నోరుతెరచుకొనియున్నది. ఈ సంగతి హిట్లరు బాగా గ్రహించలేదు. రష్యామీదకు దండయాత్ర సాగించడమే తన జన్మలో తాను సంకల్పించిన బ్రహ్మాండమైన కార్యమనిమాత్రం హిట్లరు గ్రహించాడు. ఆ మాట స్పష్టంగా ఒక ఉపన్యాసంలో హిట్లరు అన్నాడు. కాని, యీ బ్రహ్మాండమైన కార్యంలోనే తన బ్రతుకు తెల్లవారుతుందని తన నొసట బ్రహ్మవ్రాసిన వ్రాతమాత్రము హిట్లరు ఇంకా తెలిసికోలేకుండా ఉన్నాడు. అది తెలిసికొన్నవాడైతే అసలు రష్యాతో యీ యుద్ధం ప్రారంభించేవాడుకాడు.

ఎందుచేతనంటారా? రష్యారాజ్యం ప్రపంచం అంతటిలోను బ్రహ్మాండమైన రాజ్యం. మూడు వేల మైళ్ల వెడల్పుగలది. ఆరువేలమైళ్ల పొడుగు గలది. యిరోపాఖండంలోను ఆసియాఖండంలోను అపరిమితంగా విస్తరించిఉన్నది. రష్యారాజ్యం అమితమైన చలిదేశం. ఆదేశంలో ఆ చలిలో రష్యనులే ఉండగలరుగాని, మరొక దేశపు వాళ్లుగాని, మరొక జాతివాళ్లుగాని, ఆదేశంలో బ్రతుకలేరు. ఆ రష్యారాజ్యం ఇంకెవ్వరికీ భుక్తమయ్యేదికాదు. రమారమి 20 కోట్ల జనాభాగల రాజ్యం. రష్యా ప్రజలు మొండిఘల్లూకపు పట్టు గలవాళ్లు. రష్యాలోని ఏగ్రామంలో శత్రువులు ప్రవేశించినప్పటికీ, ఒక గడ్డిపోచకూడా శత్రువులకు భుక్తంకాకుండా రష్యనులు ధ్వంసంచేస్తున్నారు. రష్యనులకు ఉన్నటువంటి స్వదేశాభిమానం అతి దారుణమైనది. జర్మనుసేనల వీరావేశం ఆ రష్యను సేనల స్వదేశాభిమాన దీక్ష ముందర వ్యర్థమైపోతుంది. స్వదేశాన్ని రక్షించుటకోసం రష్యనులు ఆబాలగోపాలం తమ ప్రాణాలను తమ సర్వస్వమును త్యాగంచేసే ధీరులు. 6 కోట్ల జనసంఖ్యగల జర్మనీ, 20 కోట్ల జనసంఖ్యగల రష్యాతో "ఢీ అంటే ఢీ" అంటూ ఉన్నది. రష్యాప్రభుత్వంకూడా అపారమైన ఆయుధసామగ్రులను గత 20 సంవత్సరములనుంచి తయారుచేసింది. అటువంటి రష్యాతో, అటువంటి అలవికాని రష్యారాజ్యంతో, జర్మని యుద్ధంచెయ్యడం అసాధ్యమైనపని-అతి సాహసమైన పని. ఆ సంగతి హిట్లరు గ్రహించాడు- కాని, రష్యాతో యుద్ధం హిట్లరు చెయ్యక తప్పదు. హిట్లరుకు పక్కలో బల్లెమువలె రష్యా ఉంటున్నది. "హిట్లరుయొక్క నాజీప్రభుత్వం, హిట్లరుయొక్క సర్వాధికార నిరంకుశత్వం అంతరించాలి. అదే నాకోరిక" యని మొన్న నీమధ్యనే రష్యా ప్రభుత్వాధ్యక్షుడైన స్టాలిన్ స్పష్టంగా ఒక ఉపన్యాసంలో చెప్పాడు. నాజీ నిరంకుశ ప్రభుత్వ పద్ధతి రూపుమాయవలెనని బ్రిటిష్‌వారుకూడా సంకల్పించి ఉన్నారు. నాజీ ప్రభుత్వమును

నాశనం చెయ్యడంకోసమే రష్యాయున్నూ, ఇంగ్లాండున్నూ, అమెరికాయున్నూ, యావత్తు మిత్రమండలి రాజ్యాలున్నూ నడుముగట్టుకొని దీక్షాకంకణము ధరించి, చేతులు కలిపి, ఏకముఖముగా జర్మను సేనలను ఎదిరించుటకు సర్వసన్నాహములను చేయుచున్నవి. అమెరికాయున్నూ, ఇంగ్లండున్నూ రష్యాకు విధి విరామం లేకుండా ఆయుధసామగ్రిని రవాణాచేసి సప్లయి చేస్తున్నవి. జర్మనీకి జవాబుచెప్పగల అపారమైన అంగబలం, అర్థబలం, ఆయుధబలంతో రష్యా సర్వసమర్థంగా ఉంది. అటువంటి రష్యాపై సవాలుచేసిన జర్మనీ, యీ దెబ్బలో జయిస్తుందా ? లయిస్తుందా ?

ఇప్పటికి రష్యాతో జర్మనీ యుద్ధం ప్రారంభించి నవమాసాలు నిండినవి. కాని, యింకా దీర్ఘకాలం యుద్ధం చెయ్యవలసిన స్థితిలో ఉంది. దీర్ఘకాలం యుద్ధం చెయ్యగల సామర్థ్యం రష్యాకు ఉన్నదిగాని, జర్మనీకి లేదు. జర్మనుల యుద్ధ పద్ధతి యావత్తూ మెరుపు మెరిసినట్లుగా, శరవేగప్రాయమైనదేగాని, ఎన్ని సంవత్సరాలకైనా, సరిపడిన యుద్ధసామగ్రిని, ఇతర సాధన సామగ్రులను సమృద్ధిగా కలిగిన దేశం జర్మనీ కాదు. వాయువేగంగా జర్మను సేనలు యుద్ధం సాగించుటకు సాధనభూతమైన విమానాలకుగాని, మోటారు శకటశ్రేణికిగాని, మూలాధారమైన వస్తువు పెట్రోలు. పెట్రోలు సమృద్ధిగా ఉంటేనేగాని, విమానాలు కదలవు. పెట్రోలు సమృద్ధిగా ఉంటేనేగాని జర్మను సైనికుల మోటారు సైకిళ్లుగాని, మోటారు లారీలుగాని, ఫిరంగి మోటారులుగాని రణరంగంలో పని చెయ్యజాలవు. అమితమైన పెట్రోలు ఖర్చు అవుతుంది. ఈ పెట్రోలు సప్లయి అక్షయంగా కావాలని అక్షరాజ్యాలు తహతహ లాడుచున్నవి. జర్మనీ, జపాను, ఇటలీ అనే మూడు అక్షరాజ్యాలకు కిరసనాయిలు గనులు లేవు. ఇతర దేశాలనుండి యీ అక్షరాజ్యాలకు పెట్రోలుగాని, కిరసనాయిలుగాని సప్లయి కావలసినదే. కనుక, ఎన్ని విమానాలను జర్మనీ తయారుచేసికొనినప్పటికీ, ఎన్ని టాంకులను, ఎన్ని మోటారు వాహనాలను తయారుచేసికొనినప్పటికీ, జర్మను సైనికులకందరికీ మోటారు సైకిళ్లను సప్లయి చేయగల్గినప్పటికీ, పెట్రోలు సమృద్ధిగా సప్లయి అయితేనేగాని, ఈ శరవేగ, వాయువేగ శకటాలు ఎందుకూ పనికిరావు. శరవేగంగా యుద్ధం చేస్తేనేగాని, హిట్లరుకు వీలు లేదు. దీర్ఘకాలం యుద్ధంచేయగల అంగబలం, అనగా మిత్రరాజ్యాలకు మించిన అమిత సైనిక బలం జర్మనీకి లేదు. అందువల్లనే అతివేగంగా యుద్ధం సాగించి సమాప్తి చెయ్యవలెననే యుద్ధ పద్ధతిని హిట్లరు అవలంబించాడు. అతివేగంగా యుద్ధం సాగించడానికి సాధనభూతమైన విమానాలకు మోటారు శకటములకు ఆధారభూతమైన కిరసనాయిలు మాత్రం అక్షయంగా అక్షరాజ్యాలకు లేదు. అన్నీ ఉన్నాయిగాని అయిదోతనంలేదు అన్నట్లుగా ఉంది జర్మనీయొక్క స్థితి.

ఎంత కిరసనాయిలునైనా, ఎంత పెట్రోలునైనా సప్లయి చేయగల కిరసనాయిలు గనులు రష్యాలో ఉన్నాయి. ప్రస్తుతం బ్రిటిష్‌వారి హస్తగతమై యున్న సిరియాలోను, ఇరాకులోను, పరిషియాలోను కిరసనాయిలు గనులున్నాయి. ఈ కిరసనాయిలు గనులను వేనినైనా హిట్లరు ఆక్రమించవలెననే దాహంతో ఉన్నాడు. ఇప్పుడు హిట్లరుకు కావలసినది అక్షయమైన పెట్రోలు—ఆ పెట్రోలు దాహంతోనే హిట్లరు తపిస్తున్నాడు. దీర్ఘయుద్ధం చేయగల సామర్థ్యం హిట్లరుకు లభించవలెనంటే, అక్షయమైన పెట్రోలు కావాలి. వాయువేగంగా శరవేగంగా యుద్ధం చెయ్యవలెననినప్పటికీ సమృద్ధిగా కిరసనాయిలు గనులు కావాలి.

ఈ అవస్థ జర్మనీకి మాత్రమేకాదు. జర్మనీతోచేరిన జపానుకుకూడా ఈ పెట్రోలు దారిద్ర్యం పూర్తిగా ఉన్నది. జర్మనీలో ఏ విధంగా కిరసనాయిలు గనులులేవో అదే విధంగా జపానులోకూడా కిరసనాయిలు గనులులేవు. అందువల్ల జపానుకుకూడా పెట్రోలు దాహం ఎక్కువైంది. బర్మాలోని కిరసనాయిలు గనలవైపుకే ఇప్పుడు జపాను సేనలు బర్మాలో నడుస్తూఉన్నాయి. డచ్చి యీస్టు యిండీసు దీవులలో కిరసనాయిలు గనులు ఉన్నవి. కాని, డచ్చి యీస్టు యిండీసు దీవులలోనికి జపాను సేనలు ప్రవేశించుటకు సిద్ధముగా ఉన్నప్పుడే, ఆ కిరసనాయిలు గనులు జపానువారికి అక్కరకురాకుండా, వాటిని డచ్చి యీస్టు యిండీసు ప్రభుత్వమువారే ధ్వంసం చేసినారు. ఆ గనులలోనుంచి కిరసనాయిలు తీసి, ఆ కిరసనాయిలును శుద్ధిచేసి, పెట్రోలును

# బ్రిటిషు సేనా నాయకులు.



ఆఫ్రికా ప్రాంతములందలి బ్రిటిషు సర్వ సేనా నాయకుడగు సర్ క్లాడు అచినులేకుగారు, మేజరు జనరల్ హెచ్. బి. డబ్ల్యూ. హ్యూజెసు చీఫ్ ఇంజనీరు, లెఫ్ జనరలు సర్ జేమ్సు మార్షల్ కార్నువాల్‌గారు, ఈజిప్టులో బ్రిటిషు సేనాధిపతి.

తయారుచేయుటకు తగిన యంత్రాలయములు ఆ గనులవద్ద ఉండేవి. కాని వాని నన్నింటిని డచ్చి యీస్టు యిండీసు అధికారులే ధ్వంసం చేసివేసినారు.

ఇప్పుడు జర్మనీకి కావలసింది పెట్రోలు. జపానుకు కావలసింది పెట్రోలు.

ఈ వసంత ఋతువులో తన జర్మనుసేన విజృంభించి తిరిగీ యుద్ధం తీవ్రంగా సాగించగలదని హిట్లరు ఇదివరకే అన్నాడు. ఇప్పుడు యీ ఎండకాలంలో హిట్లరు ముందుగా దేనిమీదకు దండెత్త దలచియున్నాడు? రష్యాలోని కాకససు పర్వత ప్రాంతములలో పెద్ద కిరసనాయిలు గనులు ఉన్నాయి. ఆ కిరసనాయిలు గనులను ఆక్రమించడానికి సంకల్పించుకొని ఉన్నాడు. అదే హిట్లరుయొక్క ప్రధానలక్ష్యము. ఒకవేళ దానిని ఆక్రమించ లేకపోతే గత్యంతరమేమిటి? టర్కీగుండా దండెత్తివెళ్లి సిరియాలోను, ఇరాకులోనుగల కిరసనాయిలు గనులనైనా ఆక్రమించాలి. ఈ ఎండలలో యీ మండు వేసంగిలో హిట్లరు పూర్తిగా పెట్రోలు దాహంతోనే తన వీరావేశం చూపిస్తాడు.

పెట్రోలు అనేది తగులబడే చమురు. అది దహించుకొని పోయేవస్తువు. ఇతర వస్తువులనుకూడా దహింపజేస్తుంది. అటువంటి దహించే వస్తువుకోసం, దహించుకొని పోయే వస్తువుకోసం హిట్లరుకు దాహంపుట్టింది. ఈ దాహంతోనే దహించుకొని పోతాడు హిట్లరు. కాని, యీ పెట్రోలుతో తానే లోకాన్ని దహింపచేస్తానని హిట్లరు అంటున్నాడు. సారాతాగిన వాని పద్ధతిగాఉంది. కొంచెం సారా తాగినవాడు లోకాన్ని నమిలి మింగివేస్తానని వీరావేశంతో గంతులు వేస్తాడు. ఆ వీరావేశంలో కొంతమందిని పొడిచి చంపివేస్తాడుకూడా. సారాతాగినవాడికి ఆ దాహం అంతటితో తీరదు. ఇంకా తాగవలెననే దాహం ఎక్కువవుతుంది. మరింత తాగినకొలదీ, వాడి శరీరమే అంతకంతకు దహించుకొని పోతుంది. ఏనుగంత మనిషి పీనుగంత అవుతాడు. లోకాన్ని దహింప జేస్తానన్నవాడు తానే

దహించుకొని పోతాడు. సారాదాహం ఎటువంటిదో యీ ఎండలలో హిట్లరుకు పుట్టిన పెట్రోలు దాహంకూడా అటువంటిదే. ఈ పెట్రోలు తనకు సమృద్ధిగా లభిస్తే తన విమానాలను పల్లెలమీదకు పట్టణాలమీదకు పంపించి నిరాయుధులైన స్త్రీలు బిడ్డలు ఉండే ఇళ్లమీదకూడా బాంబులు వేసి లోకదహనం చేస్తాడు. పెట్రోలు దాహం ఎక్కువైనకొలదీ రక్తదాహం ఎక్కువవుతుంది. ఒళ్లుతెలియని వీరావేశం వస్తుంది. కోటలమీద వేస్తే బాగానే ఉండును. కొంపలమీదకూడా వేస్తాడు. కోటలు, పేటలు, హోటలు, తోటలు, ఏవైనాసరే విచక్షణలేకుండా ఆఖరుకు ఆస్పత్రులమీదకూడా బాంబులువేసి జనాన్ని చంపుటకుగాను, "నాకు పెట్రోలు కావాలి! నాకు పెట్రోలు దాహం కావాలి!" అని ప్రస్తుతం కొంత పెట్రోలు ఎక్కించుకొని రణరంగానికి వస్తున్నాడు. శత్రువునకు పెట్రోలు లభించకుండా ఆ కిరసనాయిలు గనులను రష్యావారు సర్వ నాశనమైనా చేస్తాముగాని, శత్రువశము కానీయమని అంటున్నారు.

---

# విమాన దాడివస్తే ఏంచెయ్యాలి ?

ఒక అనుభవజ్ఞుని వ్రాత.

స్పెయిను యుద్ధంలో పనిచేసిన స్కాటులండు విలేఖరి మారిసులిండెనుగారు యీ దిగువ వివరాలను తెల్పుచున్నారు.

మొదటి విమానదాడి నేను మాడ్రిడు నగరంలో చూచేను. నేననుకొన్నంత భీభత్సంగా లేదు. నేను మిత్రులు డాబాపై కూర్చొనియుండగ, మాకు హెచ్చరిక బాకాలు వినబడలేదు. వీధులో పరుగుడి పోతున్న సైనికులు "దీపాలార్పండీ" అని కేకలు వేయుటే మాకు ప్రథమ హెచ్చరిక.

ఉపయుక్తంగా వుండాలంటే దీపాలు పూర్తిగా ఆర్పేయాలి. శత్రువునకు దిగువనుండి సౌంజ్ఞలు చేయువారి దీపాలపుడు దొరికిపోతాయి. దీపాలార్పమన్న హెచ్చరిక వినని చోట్ల దీపాలు కనబడే కిటికీలలోనికి జంకులేకుండా సైనికులు గుండ్లు ప్రేలుస్తారు.

కొందరు విమానదాడివలనగూడ తమ పనికి భంగం కలుగరాదని భావించేవారుంటారు. మాడ్రిడు నగరంలో ఒక సుప్రసిద్ధ పత్రికయందు విలేఖరులు మూడో అంతస్తు మేడలో పనిచేస్తూ వుండిరి. రెండో అంతస్తు, నాల్గో అంతస్తుపై ఫిరంగిగుండ్లు ప్రేలుతున్నా వారు లక్ష్యం చేయలేదు. మాడ్రిడు ముట్టడిలో ఆ మూడోమిద్దె వన్నెకెక్కింది. లండనుపై దాడిలో గూడ యిటువంటి వెన్నో జరిగాయి.

విమాన దాడివచ్చి బాంబులు పడుతూవుంటే సిమెంటు నేలపైని కాళ్లు ముణుచుకొని కూర్చోడంకన్న, నేలను బోర్లపండుకోడం మంచిది. బాంబు ప్రేలేక జోరుగావచ్చు గాజు ముక్కలతో కూడిన వేడిగాలికి మన శరీరం గురికాకుండుటకై నేలపండుకోవాలి, ఆగాలి చాల బలం కలది, భవనాలను పడగొటుతుంది. కావున దానిని నిరోధించి నిలువలేవు. ప్రేలుడుకి దగ్గరలో నిలిచినా మీరు క్రిందపడిపోతారు, అపుడు నేల కాంక్రీటు సిమెంటయినచో తప్పక దెబ్బ తగులును. నేల పరుంటే ఎటువంటి దెబ్బ తగులకుండ తప్పించుకోవచ్చును. పైకెగిరేగాజుముక్కలు అగ్గి తునకలు శరీరానికి తగలవు, గొంతుక కూర్చున్నా నిలచున్నా, పరుగునపోయినా చాల ప్రమాదం. అట్లా చేసి చనిపోయిన వారిని నేను ఎందరినో ఎరుంగుదును.

దాగొనే గోయిలేనపుడు దాడివస్తే పరుగిడి పోవాలని బుద్ధిపుడుతుంది. అట్లా పరిగెట్టేవారు, గుంపులుగా నుంటే వారు పైన విమానాలలోని మర ఫిరంగులకు గురియగుదురు. నేల బోర్ల పరుండి రెండు చేతులు చెవులను కప్పుచు తల పైని మెడపైని పెట్టుకోవాలి. అపుడు తల వెనుక భాగానికి రక్షణయుండును. మొగం అగుపడదు. కాళ్లు మెలికవేయుట మంచిది. చేరువ కాలువయుంటే అందు దిగుట మంచిది. లేదా గోడవార పండుకోవచ్చు, ఒక కొండరాయి

చాటునో, చెట్టు మొదలువారనో, మోటారుక్రింద నో పండుకోవాలి, రోడ్డుప్రక్క కాలవలేకుంటే, ప్రక్కన గడ్డినేల పరుంటే మీదికగుపడరు.

అద్దాలుండరాదు.

మీరు దాడి సమయానికి ఇంట్లోవుంటే కిటికీలకు దూరంగా ఉండండి. కిటికీ అద్దాలకు పలుచని తెల్లగుడ్డ అంటిస్తే అవి విరిగి ఎగురవు, వెలుతురుకూడా అగుపిస్తుంది.

ఎ. ఆర్. పి. వైద్య సహాయం దళంవారు వారి మోటారులుగూడ ఒకే చోటు గుంపుగా నుండరాదు. మోటారు ఆంబులెన్సు లారీ రోడ్డు పైనుంటే తప్పించుకొని ఏదేని భవనం గోడవారను నిలదియుండుట మంచిది.

ఇలాంటి విషయములలో అన్నింటికన్న యెక్కువగ బుద్ధి నుపయోగించి సమయోచితంగా ప్రవర్తించాలి.

శాంతంగానుండి, కొంచెం తయారుగానుంటే మొదటివాటికన్న తరువాత దాడులందు నష్టం తప్పించుకోవచ్చని మాడ్రిడు, లండను, మాస్కో నగరాలపై విమానదాడులందలి అనుభవంబట్టి చెప్పవచ్చును.

# యూరోపును నాజీలు దోచుట.

అరబ్బుల స్థితిగూర్చి బుడుబుడు దుఃఖాలు.

"సావుతు ఆల్‌హక్" అను పత్రిక నాజీల అత్యాచారాలు యూరోపు దోపిడిగూర్చి యిట్లు వ్రాసెను :—"జర్మను నాజీలు యూరోపుదేశాన్ని పూర్తిగ దోచివేస్తున్నారు. యూరోపు ప్రజలు తిండిలేక మలమల మాడిపోవుచున్నారు. నాజీ అధికారుల పొట్టలు నిండుటకు జర్మనులుకాని యితర జాతులవారు కడుపు మాడ్చుకోవాలని ప్రచారంచేయు నాజీలు యిపుడు అరబ్బుల ఆర్థిక స్థితినిగురించి బుడుబుడు దుఃఖాలు ప్రకటించుచు వారిని మోసగించ జూచుచున్నారు. అరబ్బులలో అతి పేద గ్రామీయుడునుగూడ, యూరోపులో నాజీల కాలుక్రిందనున్న ప్రజలలో పెక్కుమందికన్న గొప్పవాడుగనున్నాడని వారు పయికి చెప్పేరు."

ఫ్రాంసును ఆక్రమించిన మూడు నెలలలో నాజీలు అచటినుండి 1,800 టన్నుల గోధుమలు తీసుకపోయిరి. నాల్గు వారాలలో 116 టన్నుల బియ్యం, 125 టన్నుల చమురు, 70 టన్నుల చర్మం, ద్రాక్షపంట అంతాను ఫ్రాంసునుండి జర్మనులు ఎత్తుకపోయిరి. అంతేకాక ఫ్రాంసు సాలీనా జర్మనీకి 827,000,000 పౌనులు చెల్లించాలి, గత యుద్ధానంతరం జర్మనీ చెల్లించాలని మిత్రమండలి కోరినదాని కిది మూడింతలు యెక్కువ.

# నార్వేలో జర్మను పోలీసు దురాచారాలు.

జర్మను రహస్య పోలీసుదళం నార్వేదేశంలో చేయుచున్న అత్యాచారాలగూర్చి ఒక పత్రికా విలేఖరి యీ దిగువ వివరములు తెలిపెను :—

ఓస్లో నగరంలో పూర్వం విదేశ మంత్రి కార్యాలయం యిపుడు గెస్టపో (జర్మను గూఢచారుల) కేంద్రంగా మారింది. ప్రభుత్వానికి సహాయంచేయని నేరస్థుల విచారణ అంతా రాత్రులందే జరుగును. ఆర్గురు గెస్టాపో జమానులకు ముందు త్రాగించేస్తారు. వారిలో ముగ్గురు సాక్ష్యం చెప్పవలసిన వ్యక్తిని నానా విధాల హింసించి, మిగిలిన ముగ్గురు వానిని వెక్కిరించుచుందురు.

సాధారణంగా రాత్రంతా యీ విచారణ చర్య జరుగును. అప్పటికి అతను వినకపోతే యింకో పోలీసు కేంద్రమునకు తీసుకపోయి చావగొట్టి ఒంటరి కొట్టులో పడవేస్తారు.

ఆ నేరస్తునిచే ఒప్పించుటకు లొంగదీయుటకు సాధారణంగా అనుసరించు మార్గాలేమంటే గంటలకొలది చలి గదిలో మంచు నీటిలో

కాళ్లుంచి నిలబెట్టుట; రబ్బరు ఖడ్డీలతో కొట్టుట, మీదకత్తి గట్టి అరి పాదాలలో గిలిగింతలుపెట్టుట, తెల్లవారు ఝామునలేపి రెండు గంటలలో నిన్ను కాల్చి చంపుతామని చెప్పుట.

ఇన్నిచేసినా ఒక స్త్రీ పోలీసులు చెప్పమన్నట్లు నేరమంగీకరించనందున గోడకు మొగంత్రిప్పి 8 గంటలుంచి, తరువాత చీకటి కొట్టులో పడవేసి, ఉండుండి పెద్ద కాంతిగల దీపం మొగంపై వేసిరి. తరువాత ఆమె నొక బీర్వాలోపెట్టి తాళంవేసి కొన్ని గంటలుంచి, యింకెన్నో బాధలు పెట్టి ఎప్పటికి చెప్పకపోతే విడిచేసేరు. చాల దీన స్థితిలో ఆమె స్వీడనుదేశం వచ్చెను.

# చీనాకు వైద్య సహాయం.

**చీనా వైద్యులకు ఇండియాలో శిక్షణ.**

ఇండియా మెడికలు సర్వీసు డైరక్టరు జనరలగు లెఫ్టినెంటు జనరలు సర్ గార్డను జాలీగారు యిటీవల చీనా ముఖ్యపట్నమగు చుంగ్‌కింగునకు పోయివచ్చిన పిదప, చీనాకు ఇండియా ఎటువంటి వైద్యసహాయం చేయాలో నిశ్చయించబడెను. 50 లక్షల క్వినైను మాత్రలను ఇండియా ప్రభుత్వంవారు చీనాకు పంపుదురు. చీనా వైద్యులు ఇండియాకువచ్చి మలేరియా విరుగుడు చికిత్స, టీకాలమందు తయారుచేయుట నేర్చుకొందురు. చీనాకు యింకేమి వైద్య సహాయం కావాలో తెలుపుటకు చుంగ్‌కింగులో ఒక కమిటీ నియమింపబడెను. చీనా—ఇండియా వైద్య అధికారులకు ఒకరి అవసరాలు యింకొకరికి తెలియుటకు తగు యేర్పాటులు చేయబడెను.

చీనా కొన్ని ఔషధములను చాల ఎక్కువగ తయారుచేయుచున్నది. మరి కొన్నింటిని చీనా తయారుచేయనే చేయజాలదు. ఇండియా చీనాలు రెండును విదేశాలనుండి తెచ్చుకొనే ఔషధములు యింకా ఎన్నోకలవు. దిగుమతియగు మందులు ఇండియాకువస్తే చీనాకు పంపే యేర్పాటులు జరిగినవి. ఇండియాలో తయారగు ఔషధములే చీనా కోరినన్ని యిచ్చుటకు యేర్పాటు గలదు. వాటి జాబితా చీనాకు పంపబడెను. ఎన్ని కావాలో తెలుపుతే ఇండియాలో తయారుజేయు ఏర్పాటులు సరిచేయబడును.

చీనా వైద్యులు యిరువురు బొంబాయిలో టీకాలమందు తయారుచేయుట నేర్చుకొనుటకగు ఖర్చులును, మలేరియా పరిశోధన సంస్థయందు ముగ్గురు చీనా వైద్యులు శిక్షణపొందుటకగు ఖర్చులును రాకుఫెల్లరు ధర్మనిధినుండి యేర్పాటు చేయబడింది.

ఇండియా ప్రభుత్వంవారివద్దనున్న క్వినైను మాత్రలలో 50 లక్షలు చీనాకు పంపుటకు అంగీకరించబడెను. ఇందులో 10 లక్షలు వెంటనే బర్మాలోనున్న చీనా సేనలకు పంపబడును.

# యుద్ధం పనివారి శిక్షణ.

యుద్ధంలో సేవకును, యుద్ధపరికరాల పరిశ్రమలందు పనిచేయుటకును టెక్నికలు ట్రెయినింగు యిప్పుడు 18,000 మంది ఇండియాలో పొందుచున్నారు, 5,000 మంది యిదివరకే శిక్షణ ముగించిరి. 1942 మార్చిలోగా 15,000 మందికి శిక్షణ పూర్తిచేయాలని ప్రభుత్వంవారను కొన్నారు. ఇపు డంతకన్న ఎక్కువమందే తయారయిరి.

1943 మార్చిలోగా మరో 48,000 మందిని తయారుచేయించుటకు ఉద్దేశించిరి. ఇపుడు శిక్షణకేంద్రాలు ఎక్కువయినందునను, ఉపాధ్యాయుల ట్రెయినింగు కేంద్రాలు క్రొత్తగ స్థాపించుటచేతను క్రొత్తవారు ఎంతవడిగచేరిన అంత వడిగ శిక్షణ యొసంగబడుదురు. ఇంగ్లాండునుండి 100 మంది శిక్షణ ఒసంగు బ్రిటిషువారు రప్పింపబడిరి. "బెవినుబాయిసు" శిక్షణ

పొంది మరలివచ్చినవారు యిపుడు శిక్ష ఒసంగు ఉపాధ్యాయులుగ మారిరి.

1941 జనవరిలో మొదటి జట్టు శిక్షణ ప్రారంభమయినది. ఒక ఏడాదిలోగా 310 కేంద్రాలు ఏర్పాటుచేయబడినవి. అందులో 43 దేశీయ సంస్థానములందు గలవు. మొత్తం శిక్షణార్థుల స్థానాలు 25,500 వరకు పెంచబడెను. కావున యిపుడు అభ్యర్థులే ఎక్కువగ కావలెను.

శిక్షణార్థులకిచ్చు నెల జీతాలు మెట్రిక్యులేషను ప్యాసయిన వారికి రూ 25 నుండి 27 వరకును, కానివారికి రూ 20 నుండి 22 వరకును పెంచబడెను. వారికి దుస్తులు ఉచితంగా యివ్వబడును. కర్మాగారంలో దుస్తులు రూ 7-8-0 లు విలువగలవి యిచ్చుటేగాక, యితర దుస్తులు కొనుక్కొనుటకు రూ 7-8-0 లు నగదు యిస్తారు.

---

# చుంగ్‌కింగు నగరం

## రక్షణ విధానం ప్రజల ఓర్పు, నేర్పు.

ఇండియను మెడికలు సర్వీసు డైరక్టరు జనరలగు లెఫ్టినెంటు జనరలు సర్ గోర్డను జాలిగారు, కె.సి.ఐ.ఇ., కె.హెచ్.పి., ఐ.ఎం.ఎస్.గారు చీనా ముఖ్యపట్నమగు చుంగ్‌కింగు నగరంనుండి యిట్లు రేడియో ఉపన్యాసము నొసంగిరి :—

యుద్ధ సమయపు చీనా ముఖ్యపట్నమగు యీ చుంగ్‌కింగు నగరం 1,500 మైళ్ళ దూరాన యాంగుట్సేకియాంగు నది ఎగువను గలదు. ఈ నది ప్రపంచంలోకల్ల చాలపెద్దది. శాంతి సమయాలలో చీనా ముఖ్యపట్నమగు నాంకింగు నగరందాటియే యీనది చుంగ్‌కింగునకు వచ్చుచున్నది. తరువాత షాంగేవద్ద పచ్చ సముద్రంలో కలిసిపోతున్నది. చిలియాంగు అను చిన్న నదులిచట పెద్దనదిలో కలియుచున్నవి. ఈనదుల కలయిక మధ్యనున్న కొండపై చుంగ్‌కింగు నిర్మించబడింది. బూడిదరంగు రాళ్ళతో కట్టబడిన యిండ్లతోనిండి ఆరంగేగల కొండల మధ్యనున్న యీ నగరం అంతా బూడిదవర్ణంగా కనబడును. ప్రజలు కట్టే నీలం దుస్తులున్ను 18 సం॥లక్రిందట పోయిన డా॥ సనుయటుసేను రిపబ్లికు నాయకుని గౌరవార్థం కట్టబడిన నీలం జండాలు తప్ప వేరే రెండోరంగగుపడదు.

చంగ్‌కియాంగు పైన మేఘాలుకూడ బూడిదవర్ణంగానే యుండును. కనుకనే యుద్ధ సమయ ముఖ్యపట్నంగా ఎంచబడింది. చుంగ్‌కింగు నగరంపై అక్టోబరునుండి ఏప్రిలువరకు మేఘాలు అతి దట్టంగా అతి దిగువగా నుండును. కావున శత్రు విమానాలు మేఘాలపైనే ఎగురుచు దిగువనగరంలో గుర్తులను గమనించలేవు. అదొకమేలు. నాలుగేండ్లనుండి చీనా నగరాలను జపాను విమానాలు బాంబులువేసి చికాకు చేయుచున్నవి. చుంగ్‌కింగుమాత్రం అట్టి చికాకును ఎక్కువగ అనుభవించలేదు. ఏడునెలలపాటు యీ మేఘాలావరించి పగలు రాత్రిగూడ దీపాలు ఆర్పినట్లే చీకటిగయుండును.

### బాంబుల కాలం.

మే నెలనుండి సెప్టంబరు వరకు మేఘాలుండవు. నగరం పైకి స్పష్టంగా కనపడుతుంది. చీనాకు విమానదళం చాలనందున, యీ నగరంపై యీ నెలలలో శత్రు విమానాలు దాడిచేసిన చిహ్నాలు కొండల ప్రక్కల అగుపడుతునే ఉంటాయి. శత్రు విమానదాడికి నిరోధమేలేదు. అయినా ఎ.ఆర్.పి. (విమానదాడి రక్షణయేర్పాటులు) చాల పకడ్బందిగా యున్నందునను, ప్రజల ధైర్యం ఓర్పుచేతను ఆదాడులేమి ఉపయోగం లేకుండా యున్నవి.

చుంగ్‌కింగులో అన్నిరకాల రక్షణగుహలు ఉపయోగింపబడుచున్నవి. వట్టి చీలికగోతులే కాక నేలను ప్రక్కలను కాంక్రీటుతోకట్టిన భూమిలోపల రక్షణగుహలుకూడా గలవు. ప్రక్కనున్న కొండలన్ని నగరం మెడలో మెట్లవలె కనబడతాయి. వీటిలో రాళ్ళు దొలిచి రక్షణగుహలు కట్టబడినవి. హెచ్చరిక చేయగానే నగరవాసులు ఆ గుహలలో దాగొనియుంటారు. నియమాను సరణం అతి జాగ్రత్తగ జరుగుచున్నది.

అధికారుల వుత్తరువుల శిరసావహించుట ప్రజలు బాగా నేర్చుకున్నారు. కనుకనే జననష్టం చాల తక్కువ. మంచి కట్టుదిట్టాలు యేర్పాటులుండి, ప్రజలు మనోనిబ్బరం కలిగియుండబట్టే వీరు ఎండ కాలాన్ని "బాంబులకాలం" అని తమాషాగా అంటూవుంటారు.

చీనాలో యితర నగరాలకు యీ సౌకర్యాలు లేవు. కాని ఆ నగరాలలోగూడ విమాన దాడిని అనుభవించినవారు చెప్పిన దానిబట్టిచూస్తే జన నష్టం చాల తక్కువని స్పష్టమగుచున్నది. ప్రజలు బాగా నేర్చుకున్నారు. ఎ. ఆర్. పి. అధికారుల ఉత్తరువులను తూచా విడువకుండా అనుసరింతురు. బాంబులు వేయుట ప్లాను ప్రకారం జరుగుచున్నది కావున సివిలు ప్రజల రక్షణకూడ ప్లాను ప్రకారం జరగాలని చీనా ప్రజలంటారు.

సివిలు ప్రజారక్షణ.

సివిలు ప్రజల రక్షణ బాగుగ ఏర్పాటుచేసి ప్రజలు చెప్పినట్లు విన్నచో జననష్టం చాలతక్కువని వారు అనుభవంపై తెలుసుకున్నారు.

ఇదంతా ఇండియా నేర్చుకోవలసిన విషయం. మనం విమానదాడికి సిద్ధంకావాలి. ప్రజల కన్ని నేర్పాలి, వారన్నీ అర్థం చేసుకోవాలి. రంగూనుపై మొదటిసారికన్న తరువాత దాడులలో తక్కువనష్టం కలుగుటవలన ప్రజలు అంతా తెలిసి తయారుగా నుండుటవలన ఎంతమేలో స్పష్టమగుచున్నది.

విమానదాడి సమయమున సివిలు ప్రజలందరు అధికారులు నిర్ణయించిన ప్లాను ప్రకారం ఆచరించి వారి ఆజ్ఞలను కొనసాగించినచో యుద్ధ విజయానికి తోడ్పడినవారవుతారు. ఆ విషయం అనేకసార్లు రుజువయింది.

అంతేకాక చీనా ప్రజల ఓర్పు నేర్పు ధీరత్వము యుద్ధరంగముననున్న చీనా సేనలకు బాగుగ తోడ్పడెను. ప్రజలు భీతిచెందకుండ యుండడం చాల అవసరం. జపాను దురాక్రమణను యింతకాలం తీవ్రంగా చీనా నిరోధించ కల్గుటకు చీనా సివిలు ప్రజల ధైర్యమే ముఖ్య కారణము.

బాంబులు పడ్డపుడు ప్రజలు భయపడతారు అది నిజమే. చాల భీకరమయిన అనుభవం అది. కాని చీనా ప్రజలు బ్రిటిషువారివలెనే సామాన్య కాపుదలలు కల్గియున్నచో జన నష్టం లేకుండా చేసుకోవచ్చని బాగా తెలుసుకొనిరి. సివిలు ప్రజలను చీకాకుపరచి భీతి కలిగించాలనే నగరములపై బాంబులు వేయబడును. ఆపని జరుగకుండా చేయుట ప్రజలకు వీలగును.

చుంగ్‌కింగు నగరంపై వేలకొలది బాంబులు యిప్పటికి జపానువారు పడవైచిరి. కాని చుంగ్‌కింగు నివాసులు చెక్కు చెదరలేదు. విమానదాడిని ఓర్పుతో స్వీకరించి నెగ్గుటకు చీనావారు పేర్పడిరి. ఎంతదెబ్బవచ్చిన భరించగలమని ఇంగ్లాండులో ప్రజలవలెనే చీనా ప్రజలుగూడ రుజువుచేసిరి. ఇండియాకూడ అట్లు చేయుగాక !

MADRAS. PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.